కీర్తిశేషుడు శ్రీ రామకృష్ణశాస్త్రి
నర్మపదవేత్త రుక్మిణీనాథశాస్త్రి
నాకు చిననాటి నేస్తు లేనాటికైన
అమరజీవులు మన వాఙ్మయమ్మునందు.

దైవమన్న నమ్మినవాడు తానె దైవ
మన్న వాడును పోయిరి నిన్న మొన్న
మరియు నన్నయపోయె వేమన్న పోయె
చాలు! మనకేల వ్యర్థవిచారమిపుడు?

దేహయాత్రయె నేడు సందేహమయ్యె
దేహమెల్ల రాజక బహిర్దేశమయ్యె
ప్రస్తుతాంధ్ర సారస్వత రంగమందు
వందిమాగధులే పేరు పొందగలరు!

అల విశాఖపురీసాగరాంబు తప్త
సైకతమ్ముల బహుదిన సాంధ్యవేళ
కలువరింతల మనసార కట్టుకొన్న
గాలిమేడలే మనకు దిక్కయ్యె నేడు!

ఎక్కడేని ఆశాద్యుతి యింత విరియు
నేని మన జీవితమ్ములకెంత తృప్తి?
ఆ తరుణ గవేషణమే యీ యావదాంధ్ర
మందు సత్కళానిష్ణాతు లాశపడగ!

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 22-12-78

